# వాస్తు యోగం

(పరిపూర్ణ వాస్తుకు 16 అంశాలు - 12 నమూనాలు)




ఈ పుస్తకం కలిగియున్న ప్రతివారూ

"వాస్తు విద్వాన్ - వాస్తు రత్నాలే"




రచన

**నల్లబోతుల ప్రసాద నాయుడు**

రూ.25/-

# వాస్తు యోగం

## (పరిపూర్ణ వాస్తుకు 16 అంశాలు - 12 నమూనాలు)

పదిమందిలో గుర్తింపుకు విలువైన వస్త్రధారణ ముఖ్యం
మదిలో మెదిలే శంకలకు సులువైన వాస్తు ధోరణి సౌఖ్యం

రచన

**నల్లబోతుల ప్రసాద నాయుడు**

వాస్తు - జ్యోతిష - సంఖ్యా శాస్త్రవేత్త

1/250, నవాబు పేట, నెల్లూరు-524 002. ☏ : 0861-2340739, సెల్ : 94402 75724
e-mail : prasadanayudu@rediffmail.com

# ధన్యవాదాలు

నా పరిశోధనలకు స్ఫూర్తినిచ్చిన తొలిగురువు, మేనమామ కీ॥శే॥ శ్రీ బొట్టా రామానాయుడుగారిని, నా జీవితంలో తొలిసారిగా తన అమృతహస్తాలతో సన్మానించి ఆశీర్వదించిన కీ॥ శే॥ శ్రీ డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారిని, సహృదయమిత్రులు కీ॥శే॥ శ్రీ వై. కామేశ్వరరావుగారిని, అత్యంత ఆప్తులు కీ॥శే॥ శ్రీ తుంగా రాజగోపాలరెడ్డిగారిని స్మరిస్తూ ....

నన్ను చైతన్య పరచిన గురువులు శ్రీయుతులు డా॥ నాగభైరవ కోటేశ్వరరావుగారికి, భమిడిపాడి రాధాకృష్ణగారికి, కె. రఘురామిరెడ్డిగారికి నమస్కరిస్తూ ....

నిరంతరం నన్ను ప్రోత్సహిస్తున్న శ్రీయుతులు జి. సత్యమూర్తిగారు, వెన్నెలకంటిగారు, పి. రాజేంద్రకుమార్‌గారు (ప్రముఖ సినీ రచయితలు), వల్లభనేని జనార్ధన్ గారు, ఎస్. వి. కృష్ణారెడ్డిగారు (ప్రముఖ సినీ దర్శకులు), ముంగమూరు గోపాల్ రెడ్డిగారు (ప్రముఖ నాయకులు), పి.వి.వి. భాస్కరరెడ్డిగారు, నారపరెడ్డి రాజేంద్రప్రసాద్‌గారు (ప్రముఖ పారిశ్రామిక వేత్తలు), రాటకొండ సుబ్బరాయుడుగారు (సబ్ రిజిస్ట్రార్), పైడి అంజయ్యగారు (E.O. Endowments), వద్దే శ్రీనివాసరావుగారు, (ప్రముఖ న్యాయవాది), శ్రీమతి పైడిపల్లి రమణిగారు (చెన్నై), గోపరాజు రామ్‌మోహన్‌గారు (I.G.Mint, Hyd.), ఎ.రమేష్ గారు (R&B, Hyd.), ఎల్. సత్యానంద్‌గారు (నేటి యువతరం హీరోలను నటనలో తీర్చిదిద్దుతున్న ప్రముఖ స్టేజి డైరెక్టర్ – వైజాగ్), వై. శేషగిరీశంగారు, పి. సత్యనారాయణగారు, కె. అప్పయ్యశాస్త్రిగారు, యస్. సుబ్బారావుగారు, Sd. రసూల్ అహ్మద్ గారు (ఏషియన్ పెయింట్స్).

ఈ పుస్తక ప్రచురణకు ప్రేరేపించిన మిత్రులు మైలవరపు రంగారావుగారు, మోవిడి వెంకటేశ్వరరావుగారు, ఉప్పలపాటి రాజారావుగారు, మరియు వివిధ జిల్లాల నుండి వారి జాతకాలను నా పరిశీలనకు పంపి నేను సూచించిన పరిష్కారాలతో శుభఫలితాలు పొంది అభిమానిస్తున్న ఎంతోమంది మిత్రులకు నా హృదయపూర్వక ధన్యవాదాలు తెలియజేస్తూ ...

ఎందరో పాఠక మహానుభావుల ముందుకు వస్తున్న ఈ పుస్తకంపై మీ అభిప్రాయాలను తప్పక తెలియజేసి, రాబోవు నా రచనలకు మీ ప్రోత్సాహం అందిస్తారని ఆశిస్తున్న

మీ

వల్లభనేని ప్రసాదరావు

# రచయిత మనవి

ప్రియమైన పాఠకులకు నమస్సులు. మీ కుటుంబంలో ఒక సభ్యునిగా, సదా మీ శ్రేయోభిలాషిగా మీరు తప్పక తెలుసుకోవలసిన కొన్ని నిజాలు మీ ముందుంచుతున్నాను. గృహానికి వాస్తు అవసరమే. కాని వాస్తు ఒక్కటే మనిషి జీవితాన్ని ప్రభావితంచేయదు అన్న సత్యాన్ని మీరు గుర్తించాలి. వారి వారి జాతక యోగాలు వారికి జరుగుచున్న దశా ఫలితాలు మాత్రమే వారిపై అధిక ప్రభావం చూపుతున్నాయి.

ప్రతి మనిషికి స్వభావ సమస్యలు - స్థానిక సమస్యలు - ప్రకృతి సమస్యలు అని మూడు రకాలు కలుగుచుంటాయి. మన స్వభావానికి విరుద్ధంగా జరిగేవన్నీ మనకు సమస్యలుగానే వుంటాయి. పరస్పర విరుద్ధ స్వభావాలుగల భార్యాభర్తల మధ్య మరియు ఇతర వ్యక్తుల మధ్య కలహాలు రావడం సహజం. అవసరంలేని వాటికి మరియు ధాంబికాలకు ధనం ఖర్చుచేసే స్వభావంగల వారికి ఆర్థిక సమస్యలు కలగడం నిజం. ప్రతి చిన్న విషయానికి హైరానాపడి మానసిక వత్తిడి పెంచుకొనే స్వభావంగలవారికి ఆరోగ్యబాధలు రావడం తథ్యం.

మన పరిసరప్రాంతాల సమస్యలు మన ప్రమేయం లేకుండా..ే మనము అనుభవించాల్సి ఉంటుంది. ఉదాహరణకు ఆయా ప్రాంత పరిధిలో జరుగు లూటీలు, దహనాలు, అల్లర్ల వల్ల వాటితో సంబంధంలేని ఆయా ప్రాంతాల వారు కూడ నష్టపోతుంటారు. భోపాల్ గ్యాస్ లీకేజికి బాధితుల గృహవాస్తు లోపంకాదు - ఫ్యాక్టరీ యాజమాన్య బాధ్యతారాహిత్య శాపం. గుజరాత్ మారణకాండలకు సహకరించింది వాస్తు బలం కాదు. మతాల అగ్నిగుండానికి మానవత్వాన్నే ఆజ్యంగా పోయగల దానవత్వగుణ బలం.

ప్రకృతి సమస్యల కారణంగా అకస్మాత్తుగా కలుగు భూకంపాలు - అగ్ని ప్రమాదాలు, అతివృష్టి - అనావృష్టి వల్ల ఎందరో అనివార్యమైన బాధలు పొందుతుంటారు. దివిసీమ ప్రళయాలకు - లాతూరు భూకంపాలకు కారణం వాస్తుదోషం కాదు. ప్రాణుల్ని - ప్రళయాల్ని సృష్టించగల ప్రకృతి లీలావిలాసం మాత్రమే. ఇవేకాకుండా ఒక్కోసారి ప్రభుత్వం తీసుకొను నిర్ణయాలు కొందరికి లాభం కొందరికి నష్టాలు కలిగిస్తాయి. ఇలాంటి సమస్యలన్నింటికి మన గృహవాస్తు లోపాలే కారణం కాదుకదా!

వాస్తు పరిపూర్ణముగా ఉన్న గృహాలు అమ్మవలసిన అవసరం ఎందుకు? అదే గృహములో యజమాని గాని ఇతర కుటుంబ సభ్యులుగాని కొంత కాలం యోగం అనుభవించడం మరికొంత కాలం చికాకులు అనుభవించడానికి గల కారణాలు ఏవి? అనే మీ అనుమానాలకు సమాధానం గృహవాస్తుకన్నా మీ జన్మ వాస్తు బలం ముఖ్యం అని క్రింది ఉదాహరణలతో మీకు ఋజువు అవుతుంది.

ఒక ప్రముఖ రాజకీయనాయకుడు ఎంతోమంది వాస్తు ప్రముఖుల సలహాలతో సంపూర్ణ వాస్తుతో నిర్మించిన గృహంలో ప్రవేశించిన కొంతకాలానికే కుటుంబ యజమాని దుర్మరణం చెందడం, వందల కోట్ల వ్యాపార నిర్వహణలోవున్న వారికుటుంబం ఎన్నో చికాకులు అనుభవించడం జరిగింది. ఇది వాస్తు ప్రభావం కాదు. ఆ నాయకుని జాతకం, మరియు వారికి జరిగిన దశల ప్రభావం అని గుర్తించాలి.

ఏ మాత్రం ఆదాయ వనరులు లేని రోజుల్లో వాస్తుకు విరుద్ధంగా ఉన్న గృహాల్లో నివసిస్తూ అంతంతమాత్రం జీవితాన్ని అనుభవిస్తూవారి జాతక - దశ - యోగ బలంతో ఉన్నతస్థితికి చేరిన ఎంతోమంది ప్రముఖుల్ని అన్ని రంగాలలో మీరు చూడవచ్చు. ఉదాహరణకు సినీ పరిశ్రమలో ఈనాడు ఉన్నతస్థితిలో ఉన్న ఎంతోమంది మొదట వాస్తుకు విరుద్ధమైన గృహాల్లో నివసించిన వారే. ఈ కోవలో ప్రముఖ రాజకీయ నాయకులు, వ్యాపారస్తులు, అధికారులు, ఇంకా ఎంతోమందిని చేర్చవచ్చు.

మీరు గ్రహించవలసింది ఏమిటంటే MLA పంచెలు కట్టిన ప్రతివారూ MLA లు కాలేరు. ఒకే స్కూల్లో చదివిన విద్యార్థులందరూ ఒకే విధమైన ప్రతిభ కలిగిఉండరు. అలాగే మంచి వాస్తు వున్న గృహాల్లో నివసించే ప్రతివారు ఆస్థిపరులు కాలేరు.

మీరు పాటించే వాస్తు అంశాలు మీ గృహానికి మీరు కల్గించే ఒక చక్కని అమరిక. అనివార్య కారణాల వల్ల మీరు గృహాన్ని అమ్మదలచినపుడు వాస్తు లోపాలు చూపించి మీ గృహం యొక్క ధరను తగ్గించి అతి చౌకగా కొనడానికి ముందుకు వచ్చే మహామేధావుల బారి నుండి తప్పించుకొనే ఒక కవచం.

మీ జాతక ప్రభావంతో మీకు కల్గిన యోగాలతో మీరు అభివృద్ధి చెందుచున్నారు. జాతకబలం సంపూర్ణంగా కలిగియున్న వారే విశేష అదృష్ట వంతులు, ధనవంతులు కాగలరు. అంతే కాని స్వల్ప ప్రభావం చూపించు వాస్తును ఆధారం చేసుకొని మీ జీవితంలో కలుగు కష్ట నష్టాలు, ఆరోగ్య, ఆర్థిక, బాధలు అన్నీ మీరున్న గృహ వక్రవాస్తు దోషం అని వాటిని సరిచేసి మీ సమస్యలన్నీ తొలగిస్తామంటూ కొంతమంది వాస్తు పండితులు హంగు - ఆర్భాటాలతో వేలకువేలు ఫీజులతో మిమ్మల్ని దోపిడీ చేస్తూ, వారు మాత్రం కోటీశ్వరులు అగుటకూడా వారి జాతక బలప్రభావమేగాని మరేదీ కాదు. మీ గృహానికి వాస్తు దోష నివృత్తికి ఆ మార్పులు - ఈ చేర్పులంటూ మీరు ధన వ్యయం కల్గించుకొనుట వ్యర్థం.

**వాస్తవాల్ని మార్చలేని వాస్తుకు కొన్ని ఉదాహరణలు :**

వాస్తు పరిపూర్ణంగా ఉన్న గృహాల్లోని ప్రభుత్వోద్యోగులు రిటైర్ కాకుండానే జీవితకాలం సర్వీసుల్లోనే కొనసాగగలరా? లేదు. ఇది ప్రభుత్వ చట్టాలపై మరియు ఉద్యోగుల నైతికప్రవర్తనపై ఆధారపడి ఉంటుంది.

వాస్తు పరిపూర్ణంగా ఉన్న గృహాల్లోని వారిసంతానం అందరూ ఇంజనీర్లు, డాక్టర్లూ, ఉన్నత విద్యా వేత్తలు కాగలరా? కాలేరు. ఇన్నత: వారికి కల్గిన ప్రతిభాపాటవాలు వారి వారి అభిరుచి, ఆశయాలు, వారిని తీర్చిదిద్దే వాతావరణఅంశాలు ముఖ్యం.

వాస్తును సంపూర్ణంగా పాటిస్తే ఒకే రాజకీయ పార్టీ ఎల్లప్పుడూ అధికారాన్ని దక్కించు కుంటుందా? లేదు. ఆపార్టీల అధినాయకుల జాతకయోగాలు మరియు ప్రజలకు ఆ పార్టీలపై ఉన్న విశ్వాసం, ప్రజలకు ఉపయోగపడే ఆ పార్టీల విధానాలు, వాటిని అమలుపరిచే నాయకుల తీరుతెన్నులు దోహదపడుతాయి.

దేశంలో అనునిత్యం జరిగే దోపిడీలు - దౌర్జన్యాలు, దహనకాండలు - మత ఘర్షణలు, మారణ హోమాలు, ఎన్నో రకాల కుంభకోణాలవల్ల కష్టనష్టాలు భరిస్తూ మానసికంగా, ఆర్థికంగా నష్టపోయిన వారియొక్క గృహవాస్తు దోషమా? లేక అక్రమంగా, అవినీతిగా, ధనార్జనే ధ్యేయంగా, దురాగతాలు చేస్తున్న వారియొక్క గృహవాస్తు బలమా? ఆలోచించండి.

మంచి, మానవత్వం, నీతి, నిజాయితీమార్గాలను అలవరచుకునే సమాజం - ప్రజల్ని ప్రశాంతంగా బ్రతికించగలిగే ప్రకృతి వరాలు - ప్రభుత్వం అందించే సహాయ సహకారాలు ముఖ్యం. అదే మానవుని యొక్క మనుగడకు, శాంతియుత జీవనానికి దారి చూపుతుంది. వక్ర మనస్తత్వాల దోషాలముందు వక్ర గృహవాస్తు దోషాలు చాలా...... చాలా స్వల్పం.

గృహస్తులు సాధారణంగా అనుసరించవలసిన వాస్తు నియమాల్ని 16 అంశాలు - 12 నమూనాల్లో సంక్షిప్తంగా ఇందులో తెలియజేయడం జరిగింది. ఎవరి ప్రమేయం, ఎవరి దోపిడీ లేకుండా మీ గృహవాస్తును మీరే మలుచుకోవాలి మరియు మీపై వాస్తుప్రభావం ఎంతవరకు పనిచేస్తున్నదో మీరే గుర్తించాలన్నదే ఒక్క వాస్తు పరిశోధకుడుగా నా ధ్యేయం. కొంతమందికి నిష్ఠూరం కలిగించే ఈ నిజాల్ని, నిదానంగానైనా మీరు అర్థం చేసుకున్నట్లయితే మీకు మనశ్శాంతి. నాకు మహదానందం.

# పదహారు అంశాల సారాంశం

## అంశం 1: స్థలాన్ని సరిచేసుకోండి

మొదట మీస్థలం హద్దులేర్పరచుకొని నైఋతిమూలలో ఒక మేకు నాటండి. ఆ మేకు వద్ద మూలమట్టం వుంచి పశ్చిమ హద్దు వెంబడి దారం లాగి వాయువ్యంలో ఒక మేకును, దక్షిణ హద్దు వెంబడి దారం లాగి ఆగ్నేయంలో ఒక మేకును నాటండి. ఈ మూలలన్నీ 90° లు ఉండునట్లు చూసుకోండి. తదుపరి ఆగ్నేయ - వాయువ్యాల వద్ద మూలమట్టమునుంచి తూర్పు - ఉత్తర ఈశాన్యాలకు కొంచెంపెంచుకొన్న స్థలం ఈశాన్యం పెరుగును. స్థల ఈశాన్యానికి మరియు గృహ ఈశాన్యానికి హారుతప్పించి బోరు వేసుకోండి. (నమూనాల్లో గమనించండి)

## అంశం 2 : బేస్‌మెంట్ నిర్మాణం

గృహ నిర్మాణానికన్నా ముందు ప్రహరీ నిర్మించడం మంచిది. దీని వలన ముఖ్యంగా హద్దుల విషయంలో పక్కస్థలాలవారితో వచ్చు తగాదాలు నివారించవచ్చు. అనుకొని ఉండు ఇళ్లకు ఇది వర్తించదు. గృహానికి దక్షిణ పశ్చిమాలలో గల ప్రహరీ 90° లు ఉండి తూర్పు ఉత్తరాలలో గల ప్రహరీ కొంత ఈశాన్యం పెంపు వుండుట శుభం. దక్షిణ పశ్చిమ ప్రహరీల ఎత్తుకన్నా తూర్పు, ఉత్తర ప్రహరీల ఎత్తు తక్కువగా ఉండాలి.

ఒక శుభదినం చూసుకొని మీ స్థల ఈశాన్య మూల శంకుస్థాపన చేసి గృహ నిర్మాణ బేస్‌మెంటు గోడలు దక్షిణం నుండి ఉత్తరానికి, పశ్చిమం నుండి తూర్పుకు పూర్తి చేయండి. గృహనిర్మాణానికి వాడే బరువైన మెటీరియల్స్ దక్షిణ - పశ్చిమ దిక్కులలో ఉంచండి. తూర్పు - ఉత్తరాలలో మాత్రం బరువులు ఉంచకండి.

గృహనిర్మాణం దక్షిణ - పశ్చిమ దిక్కుల సరిహద్దుగోడపై చేయరాదు. ఉత్తరం కన్నా దక్షిణం వైపు, తూర్పు కన్నా పడమర వైపు తక్కువ ఖాళీస్థలం ఉండునట్లు చూడాలి. ఏ మాత్రం ఖాళీ లేకుండా పశ్చిమ, దక్షిణాలలో గృహ నిర్మాణం చేయరాదు. నైఋతిలో నిర్మించు నైఋతి గృహంకూడా స్థలానికి సరిహద్దుపై నిర్మించరాదు.

## అంశం 3 : లింటల్ నుండి ఫ్లోరింగ్ వరకు

గృహం బేస్‌మెంట్ లెవల్ తర్వాత లింటల్ లెవల్‌కు రాగానే లింటల్ నిర్మాణం ఈశాన్యం తగ్గకుండా ఆగ్నేయ, వాయువ్య, నైఋతులు పెరగకుండా చూడాలి. లింటల్ లెవల్ తర్వాత గృహము శ్లాబ్ లెవల్‌కు చేరినపుడు ఇంటి మీద శ్లాబ్ వేయడమ్మేకాకుండా ఇంటిగోడలు దాటి వేయు శ్లాబ్ తూర్పు, ఉత్తరాలలో లేకుండా దక్షిణ, పశ్చిమాలలో వేయరాదు. శ్లాబ్ నిర్మాణం తర్వాత ద్వారాలు, కిటికీల ఫ్రేమ్స్ బిగించి ప్లాస్టరింగ్ మొదలుపెట్టుకోండి.

ప్లాస్టరింగ్ తర్వాత ఫ్లోరింగ్ తూర్పు - ఉత్తరం వైపు గదులలో ఫ్లోరింగ్ కన్నా దక్షిణ - పశ్చిమ వైపు గదులలో కొంచెం ఎత్తుగా, నైఋతిగది ఫ్లోరింగు ఇంకాస్త ఎత్తుగా ఉండునట్లు చూసుకోండి. గృహం నైఋతిగది కన్నా, ఈశాన్యంగది వైశాల్యం చిన్నదిగా ఉండాలి. దక్షిణ - పశ్చిమ దిశల గదుల వైశాల్యంకన్నా తూర్పు - ఉత్తర గదుల వైశాల్యం తక్కువగా ఉండాలి.

**గమనిక :** నిర్మాణం పూర్తి అయిన గృహానికి వాటర్ క్యూరింగ్ అతి ముఖ్యము. దాన్ని ఖచ్చితంగా పాటించండి.

## అంశం 4 : ద్వారాలు - అల్మారాలు - గేట్లు

సింహద్వారాలు ఏర్పాటు చేయునపుడు ఆ దిక్కులను సగభాగం చేసి తూర్పు - ఉత్తర భాగమునందు ఏర్పరచండి. అనగా తూర్పు - పశ్చిమం వైపు వచ్చు సింహద్వారాలు ఉత్తరం వైపు వచ్చు సగభాగం నందు దక్షిణ - ఉత్తరం వైపు వచ్చు సింహద్వారాలు తూర్పు వైపుకు వచ్చు సగభాగం నందు ఏర్పరచండి. తూర్పు మరియు ఉత్తరములందు ద్వారములు నిర్మించదలచిన దక్షిణ దిక్కున తప్పక ఒక ద్వారం ఉంచండి.

గదులలో దక్షిణ, పశ్చిమ గోడలకు అల్మారాలు ఏర్పాటు చేయండి. కిటికీలు మీకు అనువుగా గాలి వెలుతురు బాగా వచ్చునట్లుగా మీకు అవసరమైనన్ని ఏర్పాటుచేసుకోవచ్చు. ద్వారాలు, కిటికీలు, అల్మారాలు ఒకదానికొకటి ఎదురుగా ఉండునట్లు ఏర్పాటు చేసిన చూడ ముచ్చటగా ఉంటుంది. ద్వారాలు సరిసంఖ్యలోనే ఉండాలి బేసి సంఖ్యలో ఉండరాదు అనే పాటింపులు అవసరం లేదు. దానిని అతిక్రమించినా జరిగే నష్టమేమీ లేదు. మీకు అవసరం ఉన్నన్ని ద్వారాలు ఉంచుటలో ఏ తప్పు లేదు.

ఉత్తర సింహద్వారానికి ఎదురుగా చిన్న గేటు ఈశాన్యములో పెద్ద గేటు

తూర్పు సింహద్వారానికి ఎదురుగా చిన్న గేటు ఈశాన్యములో పెద్ద గేటు

దక్షిణ సింహద్వారానికి ఎదురుగా చిన్న గేటు దక్షిణ ఆగ్నేయములో పెద్ద గేటు

పశ్చిమ సింహద్వారానికి ఎదురుగా చిన్న గేటు పశ్చిమ వాయువ్యములో పెద్ద గేటు వుంచి పెద్ద గేట్లు మూసి వుంచకుండా నిత్యము వాడుకలో ఉంచండి. మీ స్థలం ఉత్తర - తూర్పు ఈశాన్యాలు చూస్తున్న మరియు పశ్చిమవాయువ్య - దక్షిణఆగ్నేయ దిశలు చూస్తున్నపుడు ఆ దిక్కున ఒక గేటు ఏర్పాటు చేయండి. ఆగ్నేయం బ్లాకు స్థలానికి దక్షిణ ఆగ్నేయములో ఒక గేటు ఏర్పాటు చేయండి, ఆగ్నేయం బ్లాకు అనగా తూర్పు మరియు దక్షిణ దిశలందు రోడ్డు కలిగిన మొదటి స్థలం.

## అంశం 5 : పూజ గది

పూజ గది తూర్పు - ఉత్తర దిశలందు ఎక్కడైనా నిర్మించుకోవచ్చు. పూజచేయువారి ముఖం తూర్పునకు గాని, ఉత్తరానికి గాని అభిముఖంగా వుండుట మంచిది. తూర్పు ఉత్తరం గోడలకు ఆనుకొనునట్లుగా ఎత్తుగా అరుగులు నిర్మించి దేవుని పటాలు ఉంచరాదు.

## అంశం 6 : వంట గది

వంట గదిని ఆగ్నేయం మూలగా నిర్మించుకోండి. అవసరాన్ని బట్టి వాయువ్యం, నైఋతి గదులలో కూడా నిర్మించుకోవచ్చు. వంట చేయువారి ముఖము తూర్పుకు అభిముఖంగా ఉండాలి. వంట కోసం నిర్మించే అరుగులు తూర్పు గోడలకు తగలకుండా మూడు అంగుళాలు ఖాళీ వదిలి నిర్మించండి.

## అంశం 7 : టాయిలెట్స్

మరుగుదొడ్లు ఆగ్నేయ - వాయువ్యాలలో ఉండటం చాలా మంచిది. మరుగుదొడ్డి గుంటలు కూడా ఆగ్నేయ - వాయువ్యాలలో ఏర్పాటు చేయాలి. ఆగ్నేయములో మరుగుదొడ్డి గోడలు ప్రధానగృహానికి గాని తూర్పుగోడకు గాని అంటుకొనరాదు. దక్షిణ ప్రహరీకి అంటుకొనవచ్చు. కాని ఇంటిపారు దాటరాదు. వాయువ్యంలో మరుగుదొడ్డి గోడలు ప్రధాన గృహానికి గాని, ఉత్తరప్రహరీకి గాని అంటుకొనరాదు. పశ్చిమప్రహరీకి అంటుకొనవచ్చు. కాని ఇంటిపారు దాటరాదు. మరుగుదొడ్డి గుంటలు ఉత్తర వాయువ్యంలో మరియు తూర్పు ఆగ్నేయంలో నిర్మించునపుడు ఇంటిపారు తగలకుండా ఏర్పాటు చేయండి. అనగా స్థలాన్ని నాలుగు సమ భాగాలుచేసి ఉత్తరం నుండి దక్షిణానికి, తూర్పునుండి పడమరకి 4వ భాగమునందు ఇంటిపారు తగలకుండా నిర్మించాలి. (నమూనా పటంలో గమనించండి.)

## అంశం 8 : డ్రైనేజి

గృహము మరియు గృహ ఆవరణములోని నీరు ఉత్తర, తూర్పు, ఈశాన్యాల ద్వారా బయటకు వెళ్ళడం మంచిది. దక్షిణసింహద్వారం గృహాలలోని వాడుకనీరు ఈశాన్యానికి పంపి అటునుంచి తూర్పు సరిహద్దు వెంబడి దక్షిణ ఆగ్నేయం ద్వారా బయటకు పంపండి. పశ్చిమసింహద్వారం గృహంలోని వాడుకనీరు ఈశాన్యానికి పంపి ఉత్తరసరిహద్దు వెంబడి పశ్చిమ వాయువ్యం ద్వారా బయటకు పంపండి. వాడుక నీటిని దక్షిణ - పశ్చిమ నైఋతుల నుండి మరియు ఉత్తరవాయువ్యం, తూర్పుఆగ్నేయం నుండి బయటకు పంపకండి.

## అంశం 9 : వాటర్ ట్యాంక్

ఇంటి పైన నీటిని నిల్వ చేసే ట్యాంకు ఇంటి శ్లాబ్‌మీద నైఋతిమూల లేక దక్షిణ, పశ్చిమ దిక్కులందు ఇంటి శ్లాబ్‌కు మరియు ట్యాంకుకు కొంత ఖాళీ వుంచి నిర్మించాలి. (అనగా నాలుగు చిన్న దిమ్మలు నిర్మించి దానిపై ట్యాంకు నిర్మించండి) వాటర్ సంప్‌లు ఈశాన్యం లేక తూర్పు, ఉత్తరాలలో ఏర్పాటు చేయాలి.

## అంశం 10 : అరుగులు

గృహానికి తూర్పు, ఉత్తరం వైపు అరుగులు గృహం ఫ్లోరింగు లెవల్ కన్నా పల్లంగా దక్షిణ, పశ్చిమ వైపు అరుగులు గృహం ఫ్లోరింగ్ లెవల్ కన్నా ఎత్తుగా ఉండాలి. గృహానికి దక్షిణ, పశ్చిమంలో అరుగులు లేకుండా ఉత్తరం, తూర్పులలో నిర్మించకండి. మరియు అరుగులు గృహంపారు దాటకుండా నిర్మించండి.

## అంశం 11 : వరండాలు

గృహానికి అంటుకొని ఏటవాలుగా నిర్మించు వాలువరండాలు ఉత్తరం, తూర్పులలో మాత్రమే ఏర్పాటు చేయండి. గృహానికి సమంగాఉండే ఎత్తువరండాల్లు పశ్చిమ, దక్షిణాలలో మాత్రమే ఏర్పాటు చేయండి. గృహం చూరుక్రింద నుండి వేయు వసారాలు ఉత్తరం, తూర్పులలో మాత్రమే నిర్మించండి.

## అంశం 12 : మూలలు మూత

ఉత్తర - తూర్పు ప్రహరీ గోడలను కలిపి ఈశాన్యం మూతవేయకండి.

దక్షిణం - తూర్పు గోడలను కలిపి ఆగ్నేయం మూతవేయకండి.

పశ్చిమం - ఉత్తరం గోడలను కలిపి వాయువ్యం మూతవేయకండి.

దక్షిణం - పశ్చిమం గోడలను కలిపి నైఋతి మూత వేయవచ్చు.

## అంశం 13 : తులసి కోట

తులసి మానవునికి ప్రకృతి ప్రసాదించిన దివ్యఔషధ వనమూలిక. దాని శక్తిని ప్రతి నిత్యం గుర్తు చేసుకుంటూ, ఆరోగ్యానికి కావలసిన విధంగా ఉపయోగించుకొనుటకు పెంచే తులసి మొక్కను గృహావరణలో ఏ దిక్కునైనా, ఏమూలనైనా నిరభ్యంతరంగా పెంచుకోవచ్చు. అంతేగాని దానికి గూడా ఫలానా దిక్కు, ఫలానా మూలలో మాత్రమే తులసికోట నిర్మించాలి అనునది ముఖ్యం కాదు. ఆ దివ్యఔషధగుణాల్ని మర్చిపోకుండా గుర్తుచేసుకోవడం అతి ముఖ్యం.

## అంశం 14 : చెట్లు

గృహావరణలో తూర్పు, ఉత్తర, ఈశాన్యాలలో పెద్ద వృక్షాలు ఉండకూడదు. దక్షిణ, పశ్చిమ, నైఋతిలలో పెద్ద వృక్షాలు ఉండవచ్చు. తూర్పు, ఉత్తరాలలో చిన్న పూలమొక్కలు పెంచవచ్చు.

## అంశం 15 : రోడ్లు

గృహము తూర్పు, ఉత్తర ముఖద్వారమైచో గృహము కన్నా రోడ్డు ఎత్తుగా ఉండరాదు. పశ్చిమ, దక్షిణ ముఖద్వారములున్న గృహములకు రోడ్డు ఎత్తుగాఉన్నా మంచిది. దీనికి అనుగుణంగా మీ గృహాల ఎత్తుల్ని సవరించుకోండి.

## అంశం 16 : వీధి పోట్లు

స్థలానికి ఉత్తర ఈశాన్యం, తూర్పుఈశాన్యములు - దక్షిణఆగ్నేయ, పశ్చిమవాయువ్య వీధి పోట్లు మంచివి. తూర్పు ఆగ్నేయం, దక్షిణ నైఋతి, పశ్చిమ నైఋతి, ఉత్తర వాయువ్యం వీధి పోట్లు మంచివి కావు. ప్రధాన గృహానికి ఏ వీధి పోటు రాకూడదు. వీధిపోటుకు లోబడి ప్రధాన గృహం నిర్మించుకోవాలి.

మీరు ఆచరించే ఈ పదహారు వాస్తు అంశాలు ఒక స్కూల్లో చదివే విద్యార్థులందరూ ఒకే యూనిఫాం ధరించినట్లుగా ఒక సమాజంలో జీవించే గృహస్థులుగా మీరు నిర్మించే గృహాలకు ధరింపజేసే ఒక యూనిఫాం మాత్రమే. పాత గృహాలవారు మీరు భావిస్తున్న వాస్తు దోషాలు మిమ్మల్ని కలవరపెడుతుంటే వాటి మార్పుల, చేర్పుల కోసం అనవసరంగా ఖర్చులు పెట్టి కొత్తగా ఆర్థికభారాల్ని మోయకండి. మీ అనుమానాల నివృత్తికి, మీ సమస్యల పరిష్కారాలకి ప్రతి ఆదివారం నేను అందించు " ఉచిత వాస్తు కౌన్సిలింగ్ సౌకర్యం " పొందుటకు సంప్రదించండి. (సెల్ నెం.94402 75724)

## ఆయములు - దిక్పతులు

గృహనిర్మాణానికి మహర్షులు సూచించిన ఏకాదశ వర్గులలో ఈ క్రింద కనబరచిన 2 వర్గులను మాత్రం పాటించుట శ్రేష్ఠం.

### 1. ఆయం 2. దిక్పతి

ఈ రెండు వర్గులను తెలుసుకొనుటకు ముఖ్యమైనది ఇంటి వైశాల్యం. దీనినే క్షేత్రపదము అందురు. దీనిని ఇంటియొక్క గోడల వెలుపల కొలతలతో పరిగణించవలెను. మీరు నిర్మిస్తున్న గృహం యొక్క పొడవును వెడల్పుచే గుణించిన వైశాల్యం వచ్చును.

**పొడవు X వెడల్పు = వైశాల్యం**

వైశాల్యాన్ని 9చే గుణించి వచ్చిన విలువను 8చే భాగించగా వచ్చు శేష సంఖ్య ఆయములను - దిక్పతులను సూచించును.

**ఆయములు**

1. శేషం వచ్చిన ధ్వజాయం
3. శేషం వచ్చిన సింహాయం
5. శేషం వచ్చిన వృషభాయం
7. శేషం వచ్చిన గజాయం

**దిక్పతులు**

1. శేషం వచ్చిన దిక్పతి ఇంద్రుడు
3. శేషం వచ్చిన దిక్పతి యముడు
5. శేషం వచ్చిన దిక్పతి వరుణుడు
7. శేషం వచ్చిన దిక్పతి కుబేరుడు

కావున శేషములు 1-3-5-7 వచ్చునట్లుగా మీ గృహ పొడవు - వెడల్పులను సరిచేసుకొనవలెను.
గమనిక : వైశాల్యం కొలతలు ప్రధాన గృహం కట్టుబడి ఏరియాకు మాత్రమే వర్తించును.

మెట్లు - పోర్టికోలు - బాల్కనీలు, పై అంతస్థుల నిర్మాణాలకి, గృహ ఆవరణలో నిర్మించు మిగతావాటికి పరిగణించవలసిన అవసరంలేదు. మీరు నిర్మించు గృహం చిన్నదైనా పెద్దదైనా పై రెండు వర్గులు మాత్రం తప్పక పాటించండి.

## పన్నెండు నమూనాల సారాంశం

ఉత్తరం - దక్షిణం - తూర్పు - పడమర దిక్కులలో సింహద్వారములు గల గృహ నమూనాలు ఒక్కో దిక్కుకు మూడు రకాల కొలతల్లో ఇవ్వబడినవి. మీ స్థల అవకాశాలకు అనుగుణంగా ప్రతి గదుల కొలతలను సవరించుకొని గృహాన్ని నిర్మించుకోవచ్చు.

వెడల్పు తక్కువగా ఉండి పొడవు అధికంగా ఉన్న స్థలంలో ప్రక్కగదుల నిర్మాణానికి అవకాశముండదు. వారు వరుసగా మూడు గాని, నాలుగు గాని గదులు వచ్చునట్లుగా గృహాన్ని నిర్మించుకోవచ్చు. అటువంటి గృహాలకు నమూనాలు వివరించడమైనది.




దక్షిణం రోడ్డు గల గృహం




ఉత్తరం రోడ్డు గల గృహం




తూర్పు రోడ్డు గల గృహం




పడమర రోడ్డు గల గృహం

## వీధి పారు దాటిన మరియు దాటని గృహాల నమూనాలు




వీధిపారు దాటిన వచ్చిన గృహము
ఈ విధంగా వీధిపారు దాటరాదు




వీధిపారు దాటని గృహము ఈ విధంగా
వీధిపారు తప్పించి గృహాన్ని నిర్మించాలి

**ఏదిక్కుల కయినా ఈ విధంగా వర్తించును**




★ గృహాల పారుదప్పిన ఇల్లు

గృహాల దక్షిణ పడమర దిక్కుల్లో వీధులు కలిగినపుడు
ఈ విధంగా ప్రక్కగృహాల పారుదప్పి గృహాలు నిర్మించరాదు. ఉత్తరం తూర్పు
దిక్కుల్లో వీధులు కలిగినప్పుడు మాత్రం పారుదప్పి నిర్మించినా దోషం లేదు.

# ఇల్లు కట్టిచూడు ....

## గృహాన్ని నిర్మించదలచిన మీరు టెన్షన్ పడకుండా తీసుకోవాల్సిన ఈ జాగ్రత్తలు పాటిస్తే గృహనిర్మాణం సులభతరం అవుతుంది.

- మీరు నిర్మించదలచిన గృహం మీ పేరుకు ఫలానా దిక్కు సింహద్వారముండాలి, ఫలానా దిక్కు రోడ్డుగల స్థలం మాత్రమే కొనాలి అనే నియమాన్ని వదిలేయండి. అన్ని దిక్కులు, అన్ని దిక్కుల సింహ ద్వారాలు అందరికి ఉపయోగిస్తాయి.
- ఏ దిక్కున గృహం నిర్మించాలన్నా మీరు చూసుకోవాల్సింది ఆర్థిక వనరులు. కనీస అవసరాలైన నీరు, విద్యుత్, రాకపోకల వసతి కలిగి కొంతదూరం అయినా తక్కువ ఖరీదులో స్థలం కొనండి. స్థలం డాక్యుమెంట్లు జాగ్రత్తగా పరిశీలించండి. లింక్ డాక్యుమెంట్లు మరియు ఆస్తివాటాదారులందరి అనుమతి సంతకాలు తీసుకోవడం మర్చిపోవద్దు. పట్టా స్థలాలా లేక డి.ఫారం పట్టాలా మరియు మైనర్ ప్రాపర్టీయా అను అంశాలపై లీగల్ అడ్వైజ్ తీసుకోండి.
- మీరు నిర్మించ దలచుకున్న గృహంలో వసతులు ముఖ్యంగాని, ఆధునిక అలంకరణలు, ఆర్భాటాలకు పోయి అప్పులుచేసి గృహాన్ని నిర్మించిన చేసిన అప్పులు తీర్చుటకు మానసిక అశాంతి ప్రారంభ మవుతుంది.
- గృహనిర్మాణ బాధ్యతల్ని పూర్తిగా బిల్డర్స్‌కు లేదా తాపీమేస్త్రీలకు అప్పగించకండి. మీరుగాని లేక మీ స్వంతమనుష్యుల పర్యవేక్షణలో ఉండడం చాలా ముఖ్యం. తక్కువ ఖర్చుతో మీ గృహాన్ని పూర్తిచేయగలం అని మిమ్మల్ని ప్రలోభపెట్టి వారిచ్చిన బడ్జెట్ రెట్టింపు చేయువారి నుండి మీరు చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి.
- గృహనిర్మాణానికి అవసరమయ్యే మెటీరియల్ ఇటుక, స్టీల్, సిమెంట్, టేకు, ఎలక్ట్రికల్, ప్లంబింగ్, శానిటరీ ఐటమ్స్‌కు అయ్యే ఖర్చుపై మీకు పూర్తి అవగాహన ఉండాలి. వాటి కొనుగోలు అప్పు లేక వాయిదాల పద్ధతిలో చెల్లింపులకు దూరంగా ఉండుట చాలామంచిది.
- మీ పని ప్రారంభించిన మేస్త్రీలకుగాని, ఇతర వర్కర్స్‌కుగాని ఎక్కువ మొత్తాల్లో అడ్వాన్స్ ఇవ్వకండి. అడ్వాన్స్‌లు ఎక్కువ మొత్తంలో తీసుకున్నవారు మీ పనులను పూర్తిచేయకుండానే మిమ్మల్ని పలువిధాల టెన్షన్స్‌కు గురిచేస్తారు. గృహ నిర్మాణం కాంట్రాక్ట్ ఇచ్చే విషయంలో మీకు కావలసిన, మీకు వారు చేయవలసిన అన్ని పనుల వివరాలు వారి వద్దనే వ్రాతపూర్వకంగా తీసుకోండి. ప్రతి విషయంలో క్వాలిటీ, క్వాంటిటీలపై మీకు తప్పనిసరిగా అవగాహన అవసరం.
- ప్రస్తుత కాలంలో పోటీతత్వ వ్యాపారం వల్ల కొన్ని మెటీరియల్స్ కొన్ని కొన్ని చోట్ల చౌకగా దొరుకుతాయి. ముందుగా వాటి వివరాలు సేకరించుటకు కాలం వెచ్చించండి. అంతేగాని అవగాహన లేకుండా అనవసరంగా ధనం మాత్రం వెచ్చించకండి.
- గృహం ఫినిషింగ్ స్థాయికి వచ్చినపుడు మీ అభిరుచులకి, అయ్యే ఖర్చులకి, మీ ఆర్థిక స్థితిని సరిచూసు కోండి. సులభపద్ధతులతో తక్కువ ఖర్చుతో మీ ఇల్లు అందంగా నిర్మించుకొనే టెక్నిక్స్ పాటించండి.
- ముఖ్యంగా "ఇంటిని చూసి ఇల్లాలిని చూడాలి" అనే సామెత సత్యం. కావున గృహ నిర్మాణాన్ని మీ ఇల్లాలి అభిరుచులకు వదలడం మీకెంతో శ్రేయోదాయకం.

*పై విషయాలన్నీ మీ అందరికి తెలియనివి కావు. కాని అవసరమైనపుడు మాత్రం ఇవి గుర్తుకురావు. ఒకసారి గుర్తుచేయడంలో తప్పులేదు కదా!*

# అస్ట్రాలజి - న్యూమరాలజి

1. అస్ట్రాలజి మరియు న్యూమరాలజి సమ్మేళనంతో పొందు ఫలితాలు చాలా ఖచ్చితంగా ఉంటాయి. "జన్మరాశి వాస్తు" మనిషి జీవితంపై సంపూర్ణంగా ఋజువవుతుంది.

2. మీ పుట్టిన తేది - సమయం - ఊరు - పూర్తిపేరు మరియు ఎక్కువగా పిలిచే పేరు - వయస్సు వివరాలు దీనికి అవసరమైన అంశాలు.

3. వివాహం, వ్యాపారం మరియు ఏదైనా శుభకార్యములకు ముహూర్తం కన్నా ముఖ్యంగా పేరుకు గల గ్రహబలం సత్ఫలితాలు గలిగిస్తాయి. అలా లేకుంటే ప్రారంభంలోనే వైఫల్యాలు కలిగి మానసిక చికాకులు ఎదుర్కొనాలి.

4. పేరు బలం అంటే పేరు యొక్క ప్రథమ అక్షరమో లేక పేరులో వున్న మొత్తం అక్షరాల సంఖ్యలను పరిగణించడం కాదు. మొత్తం పేరు లేక పిలిచే పేరు నందలి ప్రతి అక్షరంపై కలుగు గ్రహబలాల్ని పరిగణించి ఫలితాలు నిర్ధారించవలెను.

5. పేరు మార్పంటే ప్రస్తుతం ఉన్న పేరుకు దీర్ఘాలు - వత్తులు కల్పించుట కాదు. పేరులో ఉచ్ఛారణా శబ్దం పూర్తిగా మార్పు కలగవలెను. కావున పేరుకు ముందు లేక వెనుక కొత్త శబ్దం కలిసి జాతకంలో మీకు సత్ఫలితాలు ఇచ్చు గ్రహం యొక్క బలంతో పేరు మార్చవలెను.

6. పూర్తి పేరు లేక పిలిచే పేరులోని గ్రహబలం మీ జాతకంలో యోగాన్నిచ్చు గ్రహానికి సరిపడిన విశేష శుభఫలితాలు కలిగించును. అలాకాకున్న దోష ఫలితాలు కలిగించును. కావున మీకు యోగవంతమైన గ్రహబలం కలుగు పేరుతో మార్పులు చేసుకున్న అభివృద్ధి కలుగును. దీనికి మీ జాతకాన్ని సంపూర్ణంగా పరిశీలించి నిర్ణయించవలసి వుండును.

# నవరత్నాల ప్రభావం

1. శిశువు శిరస్సు భూమిపై ఉదయించే సమయంలో అతి సున్నితమైన మాడుపై ప్రసరించే గ్రహాలలోని శక్తి మరియు ఆ జీవి యొక్క పూర్వ పుణ్యబలం జీవితాంతం వారిని ప్రభావితం చేస్తుంది.

2. జాతకరీత్యా మీపై అనుకూల ప్రభావం చూపు గ్రహం యొక్క రత్నధారణ వలన మరియు, ఆ గ్రహము యొక్క అధిష్టాన దేవతలను పూజించుట వలన మీరు యోగవంతులు కావచ్చు. (మీ జాతకంలో కలిగిన యోగాల పరిధిలో మాత్రమే)

3. మీకు ఏ సమస్య ఉందో జాతకరీత్యా దానికి కారణమైన గ్రహం యొక్క రత్నం ధరించి ఆ గ్రహంయొక్క అధిష్టాన దేవతలను ప్రార్థించిన సమస్యలకు నివారణ లభించును. (మీకు జరుగుచున్న దశల ప్రభావ ఫలితాల పరిధిలో మాత్రమే)

4. నవరత్నాలు ఆయా గ్రహాల అయస్కాంత తరంగాల శక్తి ద్వారా మీ మనస్సుపై పనిచేసి మీ చేత శుభఫలితాలు కలిగించు క్రియలు చేయుటకు ప్రేరేపిస్తాయి.

5. మీకు శుభత్వం కలిగించు రత్నాల నిర్ధారణ అతికీలకమైనది మరియు అతి క్లిష్టమైనది. జ్యోతిష, సంఖ్యా శాస్త్ర పరిశోధనా అనుభవం కలిగినవారే మీకు సరియైన రత్నాన్ని నిర్ధారించగలరు. మీ సమస్యల పరిష్కారానికి మీరు సవరించుకోవాల్సింది "గ్రహవాస్తునే కాని గృహవాస్తును" కాదు.

# దిక్సూచనలు

## మీ విజయాలకు వారధి
## మీరే నిర్మించుకోండి.

1. ఈశాన్య దోషం వల్ల కలగవు కష్టాలు
ఆత్మవిశ్వాసం లోపిస్తేనే జరుగును నష్టాలు.

2. ఆగ్నేయ దోషం వల్ల కలగవు అవాంతరాలు
అహంకార ప్రవర్తన వల్లే జరుగును అనర్థాలు

3. నైఋతి దోషం వల్ల కలగవు కలతలు
నైతిక పతనం వల్లే కలుగును వెతలు.

4. వాయువ్య దోషం వల్ల కలగవు వ్యవహారాలు
వ్యసనాలవల్లే కలుగును వైఫల్యాలు.

5. ఉత్తరం పల్లంచేయడం కాదు
ఉన్నత ఆశయాలు కలిగి ఉండటం ఉత్తమం.

6. దక్షిణం ఎత్తు చేయడం కాదు
ధైర్యసాహసాలు పెంచుకోవడం శ్రేష్ఠం.

7. తూర్పు పల్లం చేయడం కాదు
తప్పనిసరిగా క్రమశిక్షణ పాటించడం ఉన్నతం

8. పశ్చిమం ఎత్తుచేయడం కాదు
పట్టుదల, పరిశ్రమలను పెంచుకోవడం ముఖ్యం.

**వాస్తు భ్రమలు వదలిపెట్టు**
**వాస్తవ క్రియలు మొదలు పెట్టు**



## పాఠకుల సౌలభ్యం కొరకు
## వివిధ ప్రాంతాల్లో వాడుకలో వున్న
## కొలతల వివరములు

**అంకణాలు :**

ఒక అంకణమనగా

72 చదరపు అడుగులు

**గజాలు :**

ఒక గజమనగా

9 చదరపు అడుగులు

**గ్రౌండు :**

ఒక గ్రౌండు అనగా

2,400 చదరపు అడుగులు

**సెంటు :**

ఒక సెంటు అనగా

432 చదరపు అడుగులు

( 6 అంకణాలు)

ఒక అంకణానికి 8 గజాలు

40 అంకణాలు × 8 = 320 గజాలు

320 గజాలు ÷ 8 = 40 అంకణాలు

ఒక గ్రౌండు అనగా 33. 1/3 అంకణాలు

266.6 గజాలు



## నమూనా : 1

## 30 అంకణాల స్థలంలో 16 అంకణాల కట్టుబడి గృహం




ఉత్తరం వీధి గల గృహం

## నమూనా : 2

## 37 అంకణాల స్థలంలో 17 అంకణాల కట్టుబడి గృహం




ఉత్తరం వీధి గల గృహం

నమూనా : 3

28 అంకణాల స్థలంలో 15 అంకణాల కట్టుబడి గృహం




ఉత్తరం వీధి గల గృహం

నమూనా : 4

46 అంకణాల స్థలంలో 24 అంకణాల కట్టుబడి గృహం




దక్షిణ వీధి గల గృహం

## నమూనా : 5

## 30 అంకణాల స్థలంలో 14 అంకణాల కట్టుబడి గృహం




దక్షిణం వీధి గల గృహం

## నమూనా : 6

## 23 అంకణాల స్థలంలో 9 అంకణాల కట్టుబడి గృహం




దక్షిణం వీధి గల గృహం

నమూనా : 7

42 అంకణాల స్థలంలో 20 అంకణాల కట్టుబడి గృహం




తూర్పు వీధి గల గృహం

## నమూనా : 8

## 20 అంకణాల స్థలంలో 8 అంకణాల కట్టుబడి గృహం




తూర్పు వీధి గల గృహం

## నమూనా : 9

## 19 అంకణాల స్థలంలో 8 అంకణాల కట్టుబడి గృహం




తూర్పు వీధి గల గృహం

## నమూనా : 10

## 22 అంకణాల స్థలంలో 9 అంకణాల కట్టుబడి గృహం




పడమర వీధి గల గృహం

నమూనా : 11

37 అంకణాల స్థలంలో 17 అంకణాల కట్టుబడి గృహం




పడమర వీధి గల గృహం

నమూనా : 12

39 అంకణాల స్థలంలో 19 అంకణాల కట్టుబడి గృహం




పడమర వీధి గల గృహం